# "आधुनिक समय में विवाह का महत्व"

## शादियाँ कम क्यों हो रही है ?

-राजीव चौधरी

विवाह भारतीय समाज में परम्परा के रूप एक महत्वपूर्ण और पवित्र हिस्सा रहा है। बल्कि ये कहिये कि विवाह एक जन्म का नहीं बल्कि सात जन्मों का पवित्र बंधन भी माना जाता रहा है। विवाह एक नवयुवक एवं एक नवयुवती के साथ रहने जीने आगे बढ़ने का रिश्ता नहीं बल्कि यह दो परिवारों के बीच बहुमूल्य सम्बन्ध भी स्थापित करता चला आ रहा हैं। किन्तु आज की भागती दौडती जिन्दगी की तेज रफ्तार में यह रिश्ता बेहद कमजोर होता जा रहा है। यदि आंकड़ों पर नजर डाले तो इसके टूटने की संख्या पश्चिम के देशों मुकाबले कुछ कम रह गयी हैं। ये भी कह सकते है कि आज के आधुनिक समय में विवाह का महत्व दिन पर दिन कम होता जा रहा हैं।

यदि गंभीरता से इस विषय पर चर्चा की जाये तो यह एक ऐसी समस्या का बनती जा रही है जो आने वाले समय में समाज और परिवारों की तबाही का बड़ा कारण बनेगी। आज हो ये रहा है कि इस आधुनिक सदी में एक तो नौजवान युवक-युवती विवाह के लिए आसानी से तैयार नहीं हो रहे और जो हो रहे है उनमें से अधिकांश के जल्द ही तलाक के मामले कोर्ट में खड़े मिल रहे हैं। जहाँ तेजी से बदलते समय में आज कई चीजें बदली वहां कुछ सामाजिक प्रतिष्ठा के रूप भी बदल गये हैं। मसलन कुछ समय पहले तक लडकें-लड़कियां मां-बाप की इँच्छा के अनुसार विवाह करके घर गृहस्थी बसाकर संतुष्ट हो जाया करते थे लेकिन आज ऐसा बहुत कम देखनें को मिल रहा हैं। बदलते इस दौर की बात करें तो स्वतंत्रता के साथ लड़कियों को अपने न सिर्फ पंख मिले, बल्कि उन पंखों को फैलाने के लिए आसमान भी मिला। ऐसे में शादी करके घर बसाने के कथन में बदलाव आ गया। अब सामाजिक रूप से स्थापित होने का मतलब शादी करके बच्चे पैदा करना नहीं रह गया, बल्कि एक अच्छी नौकरी,व्यवसाय या आर्थिक संपन्नता से हो गया हैं।

इसी विषय को यदि पलटकर लड़कों के मामले में देखें तो अधिकांश लड़के भी इससे बचने की कोशिश करते हुए लिव इन रिलेशनशिप जैसे रिश्तों को प्राथमिकता दे रहे है। दिन पर दिन दहेज के बढ़ते झूठे सच्चें मुकदमों ने कानून का किसी एक पक्ष में ज्यादा झुकना और दूसरे पक्ष को इसके खतरनाक नुकसान झेलने देना भी शादी का चलन घटने का बड़ा कारण है। ऐसा कतई नहीं है कि विवाह की संस्था खोखली हो गयी है और समाज को इससे किनारा करने की जरूरत है। नहीं बल्कि यह जो कमी हो रही है आज इसमें सुधार करने की जरूरत हैं। आज जब किसी युवा से शादी के बारे में चर्चा की जाती है तो वह नकारत्मक भाव प्रकट करते हैं यानि वह इस पवित्र संस्था को एक गुलामी जिन्दगी बताकर इससे बचने का प्रयास करेंगे।

आज से १० वर्ष पहले हुई शादी और पिछले दो से तीन वर्षों में हुई शादियों में काफी अंतर देखने को मिलता है मसलन दस वर्ष माता-पिता और परिवारों की सहमति से हुई शादियाँ जिनमें लड़का-लड़की, दो परिवार, रिश्तेदारों के साथ जितने सैकड़ों-हजार परिवार शामिल होते थे सभी एक तरह से इसके साक्षी बन जाते थे। ऐसे में जब कभी इस रिश्ते में कुछ समस्या उत्पन्न होती थी तो पूरा परिवार और समाज इसे बचाने की कोशिश में जुट जाता था। किन्तु प्रेम विवाह या कुछ समय में एक दूसरे से आकर्षित होकर की गयी शादियाँ जल्द टूट रही हैं।

सामाजिक प्रतिष्ठा का भय जो हमेशा रिश्ता बचाने में मदद करता था आज वह पूरी तरह से गायब होता जा रहा हैं। अगर अभी वर्तमान समय की बात किया जाए, तो अगर सामने वाला लड़का हो या लड़की अगर किसी से प्रेम कर लेता है, फिर वह विवाह के बंधन मे बंधने के बाद जरा सी बात पर रिश्ता तोड़ देते हैं। पिछले दिनों में ऐसे कई रिश्ते देखें एक लड़की के तलाक का कारण सिर्फ इतना था कि शादी के बाद लड़के ने उसके मुंह पर थप्पड़ मार दिया था। लड़की ने यह बात बर्दास्त नहीं की और तलाक की अर्जी डाल दी।

एक दूसरे लड़के ने अपनी पत्नी से सिर्फ इस बात से तलाक लिया कि वह देर रात तक सोशल मीडिया फेसबुक आदि पर अपने मित्रों से चेट किया करती थी। यानि आजकल के लोगों की धारणा संकीर्ण विचारधारा जैसी हो गई है, क्योंकि उन्हें प्यार क्या होता है? विवाह क्या होता है? और इसकी पवित्रता क्या होती है? उनके बारे में यह अभी तक अनभिज्ञ है। पहले के समय और आज के समय में यही अंतर है कि पहले के लोग विवाह को एक पवित्र रिश्ता मानकर हर सुख- दुख,उतार- चढ़ाव मैं साथ चल कर अपने रिश्ते को एक मंजिल तक पहुंचाते थे। परंतु आजकल के विवाह में अगर थोड़ा भी एक दूसरे को रोक- टोक किया या एक दूसरे की आवश्यकताओं की पूर्ति ना कर पाए तो फिर यह रिश्ता ज्यादा दिनों तक नहीं चल पाता, और तलाक की नौबत आ जाती है। इसीलिए आजकल की युवा पीढ़ी द्वारा विवाह को मजाक बनाया गया है, एहसास और रिश्ता अब पूर्ण रूप से खतम हो गया है।

# మాతృ గౌరవము

-పి.వి. రమణారెడ్డి

"ధన్యోఽసి రే యో వసుధామశత్రు రేకశ్చిరం పాలయితాఽసి పుత్ర తత్పాల నాదస్తు సుఖోపభోగో ధర్మాత్ ఫలం ప్రాప్స్యసి చామరత్వమ్

అర్థము : ఓ బిడ్డా ! నీవు ధన్యుడవు. ఒంటరిగానే శత్రురహితుడవై ఈ పృథివిని పాలిస్తున్నావు. ధర్మపూర్వకంగా ప్రజాపరిపాలన చేయుట వలన నీకు ఈ లోకమందు సుఖమున్ను, మరణానంతరం మోక్షప్రాప్తి యున్ను కలుగుతుంది. రాజ్యపరిపాలన-ఉత్తమ వ్యవస్థ ఉండాలని ఉపదేశిస్తుంది.

"రాజ్యం కుర్వన్ సుహృదో సందయేథాః సాధూన్ రక్షంస్తాత యజ్ఞైర్యజేథాః
దుష్టాన్నిఘ్నన్ వైరిణశ్చారిమధ్యే గోవిప్రార్థే వత్స మృత్యుంవ్రజేథాః

-మాఘ పురాణం 26-41

అర్థము : ఓ నాయనా ! నీవు రాజ్యపరిపాలన చేస్తూ మిత్రులను సంతోష పెట్టు. సాధువులను అనగా శ్రేష్ఠ పురుషుల నురక్షిస్తూ విరివిగా యజ్ఞములను (సత్కర్మలను) చేయుము. గో-బ్రాహ్మణులను (సాధుజంతువులను, బ్రహ్మజ్ఞానులను) పోషిస్తూ, సంగ్రామభూములందు శత్రువులను దునుమాడుతూ, స్వయంగా అవసరమగుచో మృత్యువును గూడా స్వీకరించు. ఈ విధంగా తల్లులు తమ బిడ్డలను ఉత్తేజపరిచి, ఉత్తమ సంస్కారాలనందించేవారు.

6) ఈలాంటి ఉదాహరణలెన్నో పాశ్చాత్య దేశములందున్నూ లభించ గలవు. అమెరికా ప్రెసిడెంటు గారఫీల్డును చంపినవాడు గీటూ. అతడు తల్లి గర్భంలోనుండగా అతని తల్లి గర్భం తీయించుకొని, ఆ పిండాన్ని హత్య చేయాలని ప్రయత్నించింది. కాని గర్భం పోలేదు. అతడు బ్రతికాడు. తల్లి గర్భమందున్నప్పుడు తల్లి మనోభావాల ప్రభావం వలన అతడు హంతకుడైనాడు. అమెరికా ప్రెసిడెంటును హత్యచేశాడు.

7) నెపోలియన్ విషయంలో గూడా ఈలానే జరిగింది. అతడు తల్లి గర్భంలోనున్నప్పుడు, తల్లి సైనికులు చేసే కవాదులను చూస్తూ తన్మయురాలయ్యేది. సైనికులు 'లెఫ్ట్ రైట్' అంటు కందంతొక్కుతుంటే వొళ్ళుజలదరించే వీరగీతములు ఆలాపిస్తుంటే ఆమె గగుర్పాటు చెందుతూ తన్మయురాలైపోయేది. గర్భావస్థ యందు కలిగిన ఈ సంస్కారములు నెపోలియన్‌నను ఒక మహావీరునిగా మార్చివేసినవి.

8) ప్రిన్స్ బిస్మార్క్ (జర్మన్) తల్లి గర్భమందుండగా, తల్లి నెపోలియన్ సేనలు జర్మనీలో ప్రవేశించి చేసిన మారణహోమం వలన ఏర్పడిన శిధిలములైన భవనములను ఎంతో బాధతో చూస్తూ ఉండెడిది. ఆ సంస్కారముల ప్రభవంచేత పుట్టి ప్రిన్స్ బిస్మార్క్-ఫ్రాన్స్ దేశంతో ప్రతీకారేచ్ఛ కలిగిన యోద్ధగా రూపొందాడు.

గర్భాధాన సంస్కారము వైదిక సంస్కృతిలో ఒక ముఖ్యమైన భాగము. మానవ నిర్మాణంలో ఇదొక చమత్కారపూర్ణమైన ఆలోచన. సమాజాన్ని ఉద్ధరించాలనే నినాదాలు చేసేవారు గుర్తుంచుకోవలసిన దేమనగా-ఈ సంస్కారం (గర్భాధానం) యొక్క మహత్వమును గుర్తించాలి. ఈ విషయంలో లోకంలో చెప్పుకొనే ప్రకారం-రామలక్ష్మణులు అరణ్యములోనుండగా లక్ష్మణుని బ్రహ్మచర్య మును పరీక్షించాలనే ఉద్దేశ్యముతో శ్రీరాముడీ విధంగా ప్రశ్నించాడు.

"పుష్పం దృష్ట్వా ఫలందష్ట్వాదృష్ట్వా చ నవయౌవనామ్ ।
ఏకాంతే కాంచనం దృష్ట్వా కన్య నో విచలేన్మనః ॥

అర్థము : లక్ష్మణా ! సువాసన గల పుష్పాన్ని, స్వాదిష్ట ఫలాన్ని, ఏకాంతము నందున్న జవరాలిని ఒంటరిగా లభించిన కాంచనమును చూచి ఎవని మనస్సు చలించదే చెప్పగలవా ?

యతివరుడైన లక్ష్మణుని సమాధానం

"మాతా యస్య పతివ్రతా పితాయస్య చ ధార్మికః ।
ఏకాంతే కాంచనం దృష్ట్వా తస్య నో విచలేన్మనః ॥

అర్థము : ఎవని తల్లి ప్రతివ్రతయో-ఉత్తమశీలవతియో, ఎవని తండ్రి ధర్మపరాయణుడో, సత్ప్రవర్తనకలవాడో, అతని మనస్సు ఏకాంతమున లభించిన కాంచనమును చూచినను చలించదు. సదాచారవంతులు, ధర్మపరులైన తల్లిదండ్రులు తమ సంతానమునకు పవిత్ర భావములను ఉపదేశిస్తూ వారిని శీలసంపన్నులుగా చేస్తారు.

*తల్లిని గురించి-బిడ్డలు చేయవలసిన విధులు (కర్తవ్యములు)*

"అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః ।
జాయా పత్యే మధుమతీం వాచం వదతు శాన్తివామ్ ॥

-అధర్వ 3-30-2

అర్థము : పుత్రః=పుత్రుడు, పితుః=తండ్రి యొక్క, అనువ్రతః=ఆజ్ఞాకారిగా నుండాలి. మాత్రా సంమనాః=తల్లి మనస్సును సంతోష పెట్టువాడుగా నుండాలి. జాయా= పత్ని, పత్యే=తన భర్త కొరకు సదా, మధుమతీంవాచం=మధురమైన, మరియు శాన్తినామ్=శాంతి ప్రదమైన, వాచం=వాక్కును, వదతు=మాట్లాడుగాక, ఈ మంత్రమునందు విశేషంగా గుర్తుంచుకోవలసిన విషయం. మాత్రా భవతుసంమనాః=తల్లి మనస్సు నెల్లప్పుడు సంతోషపెట్టడమే బిడ్డల రక్తవ్యమని గుర్తించాలి. మనస్మృతిలో-మను మహర్షి ఈ విధంగా అభిప్రాయపడుచున్నారు.

"యం మాతా పితరౌ క్లేశం సహేతే సమ్భవే నృణామ్
న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి ॥

-మను 2-227

అర్థము : బిడ్డలను కని, పెంచే సమయంలో తల్లిదండ్రులు పడే వేదనకు కష్ట సహనమునకు బదులు తీర్చుకోవడం ఎన్నివందల సంవత్సరములు సేవలు చేసినను పూర్తికాదు. తల్లిదండ్రుల ఋణాన్ని తీర్చుకోలేరు.

నేటి వైజ్ఞానికులు భూమిని తూచగలిగారు గాని, మాతృమూర్తి హృదయాన్ని కొలవలేక పోయారు. బిడ్డను గురించి తల్లి హృదయంలో భావతరంగములను గురించిన ఒక చిన్న సన్నివేశము -

వీరబలుడనే మంత్రి ఘాతృఋణము తీర్చుకోవాలనే భావంతో ఒక లక్షరూపాయల సంచినితీసికొచ్చి, తల్లి పాదపద్మములకు సమర్పిస్తూ అన్నాడు. "మాతాజీ ! అమ్మా !

నీ యిష్టమొచ్చిన విధంగా దానం చేయగలవు. దానితో నీ ఋణము నుండి నాకు ముక్తి లభిస్తుంది" ఈ విధంగా వీరబలుడు ఎన్నో రోజులు చెప్పగా తల్లి అన్నది. పుత్రా ! బిడ్డా ! నా ఋణం తీర్చుకోవాలనుకుంటే ఒక రోజు రాత్రిపూట నా వద్ద పడుకో తల్లి మంచం మీద పడుకోడానికి పుత్రుడు సమ్మతించాడు. రాత్రి కాగానే వీరబలుడు తల్లి దగ్గరకు పోయిపడుకొన్నాడు. అతనికి నిద్రరాగనే తల్లి లేపి నాయనా దప్పికయినది. నీళ్ళుత్రాపరా అన్నది సంతోషంగా లేచి వీరబలుడు గ్లాసుతో నీళ్ళిచ్చాడు. ఆమె ఒకటి రెండు గుటకలు వేసి, మిగిలిన నీటిని పక్కమీద దొర్లించింది. పక్క అంతా తడసి పోవడం చూచి, ఏమి చేశావమ్మా అని అడుగగా నాయనా పొరపాట యిపోయినదని చెప్పింది. వీరబలుడు శాంతించి, నిద్రించాడు. నిద్రలో పుత్రుడు గురకలు పెట్టడం మొదలు పెట్టగానే తల్లి వానిని లేపి బిడ్డా ! దప్పికగుతున్నది. నీళ్ళు యివ్వమనగా, 'అమ్మా-ఇప్పుడేగదా నీళ్ల త్రాపాను ఇంతలోనే మరలా దప్పికైనదా ? పత్తిగింజలు ఏమైనా తిన్నావా ! అంటే లేచి, గ్లాసు నిండా నీళ్ళు నింపి యిచ్చాడు. తల్లి మొదటి మాదిరిగానే ఒకటి రెండు గుటకలువేసి, నీటినంతటిని పక్కమీద పోసింది. దీనికి వీరబలుడు విసుక్కుంటూ అమ్మా-ఏమిచేశావు. పక్కంతా తడిపేశావు. అనగా నాయనా ! చీకటిగా ఉన్నందున గ్లాసు చేతినుండి జారిపోయినదని జవాబు చెప్పినది. అది విని శాంతించి వీరబలుడు వెంటనే నిద్రించ ప్రారంభించాడు. నిద్రపోతుండగా మరలా లేపి, మంచి నీళ్ళు అడుగగా ఈసారి వీరబలుని కోపం 104 డిగ్రీలు వరకు పెరిగింది. కోపంతో అమ్మా ! ఏమిటి ఒకటే నీళ్ళు తీసికొచ్చి ఇదిగో త్రాగు-చావు అన్నాడు. తల్లి మరలా మొదటి లాగానే కొంచెం నీరు పెదవులకు తావించి, తక్కిన జలంతో పక్కంతా తడిపివేసింది. ఇప్పుడు ఇక వీరబలుడు సహించలేకపోయి, కోపంతో అన్నాడు గదా ఈలా కష్టపెట్టుడానికేనా నన్ను నీ మంచం మీదపడుకోమన్నావు ? నీ బుద్ధి చెడిపోయినట్టుగా వున్నది. అప్పుడు తల్లి అన్నది. బిడ్డా ? చాలించు ఆపు-నీవు నా ఋణం తీర్చుకొన్నావు. తల్లి ఋణం తీర్చుకోగలుతావా ? నీ తలమీద ఎన్ని శిరోజములన్నవో అన్ని జన్మలెత్తి నిరంతర సేవ చేస్తూ గూడా మాతృఋణు నుండి విముక్తుడవుకాజాలవు. ఎందుకంటావా నీకు వినిపిస్తాను విను నీవు గర్భంలో ఉన్నావు. ప్రసవించే దినములు సమీపించినవి. (ఫలితజ్యోతిషం వేదవిరుద్ధము ఇచ్చట కేవలం ప్రసవవేదనంలో తల్లి పడే బాధను తెలుపుటకే ఈ ఉదాహరణ) జ్యోతిష్కులను అడుగగా నా గర్భాంలో బిడ్డ పుత్రడేనని చెప్పారు. నా బిడ్డదేమగునని అడుగగా జ్యోతిష్కులు చెప్పిన సమాధానమిది-నీ ప్రసవం రాత్రి మొదటి ఝామున జరిగితే-నీ బిడ్డడు చౌకీదారగును, రెండవ ఝాములో జరిగితే-జేల్‌దార్ అగును. మూడవ ఝాములో జరిగితే మంత్రి అగును. నాల్గవ ఝాములో అయితే మహారాజగును.

ప్రసవించే సమయం దగ్గరకు రాగానే ఓ పరమేశ్వరా ! నా ప్రసవం మొదటి రెండవ ఝాములో కలుగకుండుగాక అని ప్రార్థించాను. మొదటి ఝాములో ప్రసవంకాలేదు. కాని రెండవ ఝాము ప్రారంభం కాగానే నాకు ప్రసవవేదన ప్రారంభమై తీవ్రతరంకా జొచ్చింది. ఏదో విధంగా సహించి రెండవ ఝాము ముగిసింది. ఇప్పుడు సహించరాని వేదన ప్రారంభించింది. ప్రాణాలు పోతున్నవా అన్నంత బాధకలిగింది ఎంతో సహించిన తరువాత, మూడవ ఝాముతో నిన్నుకన్నాను అందువలన నీవు మంత్రివి కాగలిగావు. ఇప్పుడు నీవే చెప్పు ? నీవిచ్చిన ఈ చిల్ల పెంకులతో నా ఋణం తీరిపోయిందా ?

నీవు పసిబిడ్డగా ఉన్నప్పుడు పక్కమీద, మలమూత్రములు వదిలేవాడవు. నీ తడిసి పోయిన వస్త్రములను విప్పివేసి, నా వద్ద ఉన్న పొడిగుడ్డలతో నిద్రబుచ్చే దాన్ని ఒక్కరోజుకాదు, వారం రోజులు కాదు, మాసంనిండా కాదు నిరంతరం కొన్ని సంవత్సరాల వరకూ నీ యంతట నీవు వేరే పడుకోగలిగే వరకు నేను అలా చేస్తూవుం దేదాన్ని ఒకటి రెండుసార్లు పక్కనీటితో తడిసినందుకే-కోపం వచ్చి విసుక్కుంటు న్నావు. ఒక్క రాత్రికే గాబరా పడ్డావు.

ఈ విషయం విని వీరబలుడు సిగ్గుపడి తల్లిపాదాలు పట్టుకొని అన్నాడు. "అమ్మా ! నీవు ధన్యురాలవు. నీ ఋణం చెల్లించడం అసంభవం".

ఇట్టి మమతా స్వరూపిణియగు మాతృ మూర్తితో ప్రతి పుత్రుడు-పుత్రిక-ప్రేమైక హృదయ సంపన్నురాలుగా ఉండాలి. పొర పాటున గూడా ఎప్పుడైన వేరొక శబ్దములు పలుకరాదు. తల్లిదండ్రులతో విరోధం పెట్టుకోరాదని శుక్రనీతి సారమున్నూ ప్రబధిస్తుంది.

**"మాతృ పితృ గురు స్వామి భాతృ పుత్ర సఖిష్వపి ।**
**న విరుద్ధయే న్నాకుర్యాన్మనసాఽపి క్షణం క్వచిత్** -శుక్రనీతి 3-50

అర్థము : తల్లి, తండ్రి, గురువు, స్వామి, సోదరుడు, పుత్రుడు, మిత్రుడు వీరితో ఒక్క క్షణమైనను విరోధించరాదు. అపకారం చేయ రాదు.

వేదాధ్యయనానంతరం స్నాతకులకు ఇచ్చిన దీక్షాంత భాషణము వేద విద్యలు చదవడం పూర్తి అయిన మీదట ఆచార్యుడు అన్తే వాసిని (శిష్యుని) అనుశాసిస్తాడు. దీక్షాంతంలో ఉపదేశిస్తూ అంటాడు.

**"మాతృదేవో భవ, పితృదేవో భవ**
**ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ**
-తైత్తిరీయ 1-11-2

అర్థము : తల్లిని దేవతవలె భావించు. తండ్రిని దేవునివలె తలంచు, ఆచార్యుని దైవము వలె గౌరవించు, అతిథిని (సమాజం కొరకు జ్ఞానోపదేశం చేస్తూ వచ్చేవారు) దేవత వలె ఆదరించు నవస్నాతకునకు 'తల్లిని దేవతాతుల్యంగా భావించమని చెప్పి-తల్లికి గౌరవనీయులలో మొదటి స్థానమిచ్చారు. పై నలుగురను దేవతలుగా భావించి సత్కరించ మని ఆచార్యుడు నవస్నాతకునకు ఆదేశమిస్తు న్నాడు. తల్లి నిన్ను తొమ్మిది మాసాలు తన గర్భమందుంచుకొని పాలించి పోషించింది. తండ్రి నిన్ను పోషించి పెద్దవాడిని చేశాడు. ఆచార్యుడు నీకు విద్యాబుద్ధులు గరిపి నిన్ను మానవునిగా మార్చాడు. అతిథిని మీ తల్లిదండ్రులు శిరముల వంచి నమస్కరించి ఆతిథ్యము ద్వారా గౌరవిస్తున్నారు. కాబట్టి వీరినందరిని దేవతలని భావించు, నీవున్ను ఒకప్పుడు తండ్రివికావచ్చును. సంతానం కలుగుతుంది. నీ భార్య బిడ్డలకు మాతృమూర్తి కావచ్చును. నీవున్నూ ఒకప్పుడు అతిథిగా మరొకరి గృహమునకు పోవచ్చును. ఇప్పుడు నీవు వీరందరిని దేవతలుగా భావించినచో

మీ సంతానమున్నూ మిమ్ములను దేవతాతు ల్యులుగా భావిస్తారు. గృహస్థ ధర్మమందున్న ఈ పద్ధతి (ఆచారము) వైదిక సంస్కృతిలో ఒక ముఖ్యమైన భాగము. ఇదే ధర్మమును నీవు నిర్విఘ్నంగా సాగించు. ఈ క్రమమునే సంతానం తర్వాత సంతానం అనుసరిస్తూ పోతుంది. ఈ క్రింది ఐదుగురిని తల్లివలె భావించి గౌరవించమనిచాణక్య నీతిలో ఉప దేశింపబడింది.

"రాజపత్నీ గురోఃపత్నీ మిత్రపత్నీ తథైవచ పత్నీ మాతా స్వమాతాచ పఞ్చైతా మాతరః స్మృతాః -చాణక్య నీతి 4-27

అర్థము : దేశాన్ని పాలించి సుఖసం పదలను కలిగించే ప్రభువుపత్ని, విద్యా విజ్ఞానాన్నిచ్చి మనుష్యునిగా తయారు చేసిన ఆచార్యునిపత్ని, ఆప్తమిత్రుని భార్య అదే విధంగా భార్యతల్లి (అత్త) స్వమాతయు వీరందరిని తల్లులుగానే భావించాలి. తల్లిలా గానే వీరితో వ్యవహరించాలి. గౌరవించాలి.

## మాతృ మమకారము

ఒక పిల్లవాని కొరకు ఇద్దరు తల్లులు వీడునాకొడుకున, వీడునాకొడుకని పరస్పరం గోలగోలగా పోట్లాడుకోజొచ్చారు. చివరకు ఈ వివాదము రాజుగారి వద్దకు చేరింది. ఈ వివాదమును రాజుగారు పరిష్కరించలేక చిన్తాగ్రస్తులైరి. ఎందుకు చింతిస్తున్నారని రాణిగారడుగగా-పోట్లాటకు గల కారణ మును వివరించాడు. 'ఈ విషయం స్త్రీలకు సంబంధించినది కాబట్టి నేను పరిష్కరిస్తాను. మీరు నిశ్చింతగా ఉండుడని' చెప్పినది.

రెండవరోజు రాజసింహాసనం మీద రాణిగారు గంభీరంగా కూర్చున్నారు. పిల్లవాడు ఎవరి బిడ్డడోతేల్చడానికి ఒక హంతకుని పిలిచి, కృపాణంతో ఈ పిల్లవానిని రెండు ముక్కలు చేసి చెరొక భాగం యివ్వమని చెప్పింది. ఆ బిడ్డకు నిజంగా ఎవరు తల్లో ఆమె ఈ మాట వినగానే ఏడ్చి దగ్గోలు పెట్టిరాణిగారూ ! ఈ బిడ్డ నాకవసరంలేదు. ఆమెకే యివ్వమని ప్రార్థించింది. ఏ తల్లి ఆ బిడ్డను కనలేదో ఆమె పిల్లవానిని ముక్కలుగా నరుకుటకు చాలా సంతోషపడింది. రాణిగారు వెంటనేతెలిసికోగలిగారు. ఏ తల్లి పిల్లవానిని ప్రాణం కంటే అధికంగా ప్రేమిస్తుందో, ఆమెయే ఈ పిల్లవానికి తల్లి. ఆమెకే ఈ బిడ్డనివ్వమని న్యాయం చెప్పింది. నిజంగా తల్లి బిడ్డయందుండే మమకారం అమర మైనది. అట్టి మమత శాశ్వతంగా ఉండాలి.

## తల్లి మమకారం-హృదయస్పందన

హృదయమునకు సంబంధించిన విషయం రాగం. ఒకానొక ఫ్రెంచి లేఖకుని కథ జ్ఞప్తికొస్తుంది. ప్రేమికుడు యువకుడు యౌవన వనవిహారిణయగు ప్రేమికతో "ప్రేయసీ ! సమస్త ప్రపంచైశ్వర్యమునంతయు నీ చరణములకు సమర్పించగలను. ఆకాశమందున్న నక్షత్రాలను తెంపి నీ జఇులో పూలదండగా అలంకరించగలను. ఒక్కసారి నీవు సైగచేసి నాదానివని తెలిపితే చాలు" అన్నాడు. నిజమా ? అని ప్రేమిక ప్రశ్నించగా-నిజంగా, నిజంగా, నిజంగా- అన్నాడు. అయితే నీ మదునలి తల్లి హృదయాన్నితీసి నాకు తీసికొచ్చి యివ్వగలి గితే-అప్పుడు నేను నీ దాననని అన్నది. ప్రేమతో పిచ్చివాడైన యువకుడు ఈ పాపకర్మ చేయుటకు తయారై పిడికత్తితో తల్లి గుండెను చీల్చి హృదయమును బయటకు లాగి, దానిని బహుమూల్యమైన పళ్ళెరమందుంచి, పట్టురూ మాలతో కప్పి తన ప్రేయసికి బహుకరిం చుటకు బయలుదేరాడు. ఇంతలో ఆ యువకుడు ఎదురు దెబ్బతగిలి పడపోయాడు. పళ్ళెం ఒకచోట, రూమాల మరొక చోట తల్లి గుండె వేరొక చోట పడిపోయాయి. అప్పుడు "బిడ్డా ! నీకేమైనా దెబ్బతగులలేదుగదా" అనెడి సన్నటి శబ్దము దుమ్ములోపడి చెల్లాచెదరైన అమ్మ హృదయమునుండి ఆ యువకునకు వినబడింది.

ఆ యువకుడు లేచి, ఆ గుండెను తీసి కొనిపోయిన తన ప్రేయసికి సమర్పించాడు. "తల్లికి కానివాడవు నాకు మాత్రము ఏమవుతావని" ప్రేయసి జవాబిచ్చింది.

## శ్రవణకుమారుని పితృభక్తి

శ్రవణకుమారుని పితృభక్తి-సేవా భావము జగత్ప్రసిద్ధమైనది. వృద్ధులు, అంధులైన తన తల్లిదండ్రులకు శ్రద్ధతో సేవలొనరించెడి వాడు. తీర్థస్థానములు చూపించుటకు తల్లిదండ్రులను కావడిలో కూర్చోపెట్టుకొని ఆ కావడిని మోస్తూ యాత్ర చేయుచుండెడి వాడు.

ఒకసారి అరణ్యములో పోవుచుండగా, తల్లికి, తండ్రికి దాహమైనది. నీరు తెచ్చుటకై నదీ తీరమునకు పోయాడు. అప్పుడే దశరథమహారాజు వేటకై అదే అరణ్యమునకు వచ్చాడు. నీటిలో శబ్దమును విని, అడవి మృగమనుకొని శబ్దభేది బాణమునువదలగా ఆ బాణము శ్రవణకుమారుని గుండెకు తగిలింది. ఏదో మనుష్యుని శబ్దముగా విని వెళ్ళిచూడగా తన చేతిలో శ్రవణకుమారుని గుండెనుండి తీక్షణమైన బాణమున్న తీసి, "నీవెవరవు ? నీ పేరేమిటి ?" అని అడిగాడు.

మహారాజా ? నేను శ్రవణకుమారుడను. గుడ్డివారు వృద్ధులైన నా తల్లిదండ్రుల దప్పిక తీర్చుటకై నేనిచ్చుటకు వచ్చాను. వాళ్ళు చాలా దప్పిగొని యున్నారు. దప్పిక గొని వారు ప్రాణాలనే వదలిపెట్టవచ్చు. అందువలన తమరు వెంటనే మా తల్లిదండ్రులకు నీళ్ళు త్రాగించండి. దశరథమహారాజు పాత్రలో నీళ్ళు తీసికొని, శ్రవణ కుమారుని తల్లిదం డ్రులవద్దకు వచ్చి జరిగిన విషయమునంతను చెప్పగా శ్రవణకుమారుని మత్యుసమాచారము విని పుత్రవియోగము వలన తమ ప్రాణము లను వదిలారు.

సూర్యచంద్రులు ఆకాశమున నున్నంత వరకు తల్లిదండ్రులకు శ్రవణ కుమారుడు చేసిన సేవాభక్తి గూడా సదైవ శాశ్వతంగా ఉంటుంది.

**"మాత-పితాకో తీర్థకరానే శ్రవణ చలా కుమార ।**
**మార్గ మే రాజా దశరథ కా శ్రవణ హువా శికార**
**మరతే దమ తక్ థా కంఠ మే మాత-పితా- కా ప్యార**
**సభీ చాహతే జుగ జుగ జియే ఐసా శ్రవణకుమార ।**

## ఛత్రపతి శివాజీ మాతృభక్తి

మహారాష్ట్రమునకు సంబంధించిన మహా పురుషుడు ఛత్రపతి శివాజి. ఆయన తల్లిపేరు బీజాబాయి. ఒకసారి ఆమెచాలా జబ్బున పడినది. ఆరోగ్యము దినదినానికి తగ్గడం మొదలైంది. శివాజీ చాలా చింతితుడైనాడు. వైద్యుని వద్దకు వెళ్ళి తల్లి అనారోగ్యమును గురించి విన్నవించాడు. 'నీ తల్లి కొరకు సింహం పాలు తీసికొని రాగలిగితే మీ తల్లికి ప్రాణరక్షణ జరుగుతుందని' వైద్యుడు సలహా యిచ్చాడు.

వైద్యుని సలహా విని, రాత్రి సమయంలో ఘోరారణ్యములో ప్రవేశించాడు. శీతాకాలపు

రోజులు. ప్రాతఃకాలము ఆడ సింహం అరణ్యంలో వృక్షముచాటున చలికి వణకు చుండినది. నిర్భయంగా శివాజీ ఆ సింహం వద్దకు పోయి పాత్రలో పాలు పితుకుకొని వచ్చి వైద్యునకిచ్చాడు. సింహం పాలలో మందు కలిపి వైద్యుడు బీజాబాయికి త్రాగించాడు. ఆమె ఆరోగ్యవంతురాలైనది. తన ప్రాణాలను గూడా లెక్కించకుండా తల్లికొఱకై అచంచల భక్తిని చూపించిన వీరశివాజీ ధన్యులు.

### *నా తల్లి*

***(క్రాంతికారి ఐన రామప్రసాద్ బిస్మిల్ ఉరికంబం మీదికి పోయేముందు తన తల్లికి వ్రాసిన కృతజ్ఞతాజ్ఞాపనము)***

నా తల్లిగారు పదకొండు సంవత్సరముల వయస్సులో వివాహితురాలై షాహజాహాపురం వచ్చింది. అప్పుడామె పూర్తిగా చదువు రానిదిగా గ్రామీణ కన్యవలెనుండిడిది. షాహజాహాపురంనకు వచ్చిన రోజులలో మా అవ్వగారుతన చెల్లిలిని పిలిపించి నా తల్లికి గృహకార్యములందు శిక్షణ యిప్పించినది. కొలది దినములకే మా తల్లిగారు గృహము నకు సంబంధించిన పనులన్నియు తెలిసికొని భోజనాదులను చక్కగాచేసి పెట్టుచుండెడిది. నేను జన్మించిన తరువాత ఐదారు సంవత్స రములకు హిందీ చదవడము ప్రారంభిం చింది. చదువు కోవాలనే కుతూహలం ఆమెకు స్వయంగా కలిగినదే. ఆ పేటనుండి మా యింటికి వచ్చే స్నేహితురాండ్రలో, చదువు కొన్నవారి నుండి తల్లిగారు అక్షరాలు నేర్చు కొనేది. ఈ విధంగా గృహకార్యములు పూర్తి అయిన మీదట ఏకొంచెం సమయం దొరికినా అప్పుడామె చదవడం-వ్రాయడం నేర్చుకొనుచుండెడిది. పరిశ్రమ ఫలితంగా ఆమె కొలది రోజులలోనే దేవనాగరి (సంస్కృతభాష వ్రాయుటకుపయోగించే లిపి. అదే ఇప్పుడు హిందీకి గూడా ఉపయోగిస్తు న్నారు.) పుస్తకమును చదువగలిగింది. నా చెల్లెండ్రకు చిన్నవయస్సులోనే మాతల్లిగారే విద్య నేర్పుచుండెడిది. నేను ఆర్యసమాజంలో చేరినప్పటినుండి తల్లిగారితో బాగా వార్తాలా పములు జరుగుచుండెడివి. అప్పటికంటె ఇప్పుడు ఆమె ఆలోచనలో ఉదారత కనపడు చుండెడిది. నాకాలాంటి మాతృమూర్తి లభించ నిచో నేనున్నూ సాధారణ మానవునివలె సంసార చక్రములో పడి జీవితము గడుపు చుండెడివాడినేమో. విద్యనేగాక, క్రాంతి జవన విధానములో గూడా మేజినీకి తల్లి శిక్షణ యిచ్చినట్లుగా మాతల్లి మాకు నేర్పించి సమయమొచ్చినప్పుడు ఆ విషయాలన్నిటిని నేను వ్రాయగలను. "ఎవరికి ప్రాణ హానికలి గించరాదనేదే". ఆమె నాకిచ్చిన అన్నిటికంటే ముఖ్యమైన ఆదేశము. ఆమె యిచ్చిన ఆదేశాన్ని పూర్తిచేయుటలో వివశుడనై ఒకటి రెండు మార్లు ప్రతిజ్ఞాభంగం కూడా చేయవలసివచ్చింది.

### ఓ జన్మనిచ్చిన తల్లీ !

ఈ జీవితములో మీ ఋణం తీర్చుకొను టకు అవసరమే లభించలేదు. ఈ జన్మలోనే కాదు. ఎన్ని జన్మలెత్తినను కూడా జీవిత మంతా ప్రయత్నించినప్పటికి మీ ఋణాన్ని తీర్చుకోలేను. మీరు చూపించిన ప్రేమ, నా జీవిత నిర్మాణంలో మీరు నన్ను పెంచి పెద్ద జేసిన తీరు-అవర్ణనీయము. మీరు ఏ విధంగా వేదవాణి ద్వారా నాకుప దేశించి, నన్ను మానవునిగా మలచిన సంఘటనలన్నీ నాకు స్మరణకు వస్తున్నవి. మీ దయవలననే నేను దేశసేవలో నిమగ్నుడనైతిని. ధార్మిక జీవనంలో గూడా మీ ప్రోత్సాహమే నాకు సహాయపడింది. నాకు ప్రాప్తించిన విద్యా విజ్ఞానాలకు కారణం మీరే. ఆఘనత మీకే దక్కుతుంది. మీ రొసంగిన మనోహర ఉపదే శములు స్మృతికి వచ్చినప్పుడు మీ మంగళ మయ స్వరూపం ధ్యానం చేసినప్పుడు-నా శిరస్సు మీ పాదముల ముందు అవనత మగుచున్నది.

నన్ను దండించదలచినప్పుడు గూడా మీరెంతో స్నేహమయ ముద్రలో ప్రతి విషయాన్ని తెలియజేయుచుండెడి వారు. నేను పొగరుబోతుగా సమాధానమిచ్చినప్పుడు గూడా.

నాయనా ! నీకేది మంచిదనిపించితే అదే చేయి, కాని, అలా చేయడం మచిదికాదు. దీని వలన సత్ఫలితంరాదంటూ ప్రేమవాక్కు లతో నాకు తెలిపేదానవు.

జీవనధాత్రీ ! మీరు ఈ శరీరమునిచ్చి పాలిచ్చి, పోషించడమేగాక, ఆధ్యాత్మిక, ధార్మిక సామాజికంగాను అభ్యున్నతికి మీరే సదా సహాయకులుగానున్నారు. జన్మ-జన్మాం తరంలో గూడా మీలాంటి తల్లే లభించుగాక. గొప్పసంకటములందున్నూ మీరు నన్ను ధైర్యంగా ఉంచగలిగారు. ఎల్లప్పుడు మీరు మీ సహజమైన ప్రేమసీయూషవాక్కుల ద్వారా నన్ను ఓదార్చుచుండెడివారు. మీ దయ వలన నా జీవితంలో ఏ కష్టాన్ని అనుభవించలేదు. ఈ ప్రపంచంలో నాకు ఏ భోగ విలాసం మీద గాని, ఐశ్వర్యం మీదగాని కోరికలేదు కేవలం ఒకే కోరిక అదేమంటే శ్రద్ధతో మీచరణ సేవ చేసి నా జీవితమును సార్ధకపరుచుకోవాలని కాని ఈ కోరిక కోరికగానే ఉండిపోతుందేమో పూర్తికానట్లు తోస్తున్నది. దుఃఖపూర్ణమైన నామృత్యు సమాచారము మీకు వినిపించ బడుతుంది. అమ్మా ! మీ పుత్రుడు తల్లులకు తల్లియగు భారతమాత సేవలో తన జీవిత మును బలివేదికకు పూర్ణాహుతి యిచ్చాడని మీ గర్భమున పుట్టినందుకు-మీ గర్భమును కళంకితం చేయలేదని తెలిసికొని, మీరు ధైర్యముగా ఉంటారని విశ్వసించుచున్నాను.

నా ప్రతిజ్ఞలో దృఢంగా నిలిచాను. స్వతంత్ర భారతచరిత్ర వ్రాయునప్పుడు ఆచరిత్ర పుటలలో సువర్ణాక్షరములతో మీ పేరున్నూ వ్రాయబడుతుంది. గురుగోవింద సింహుని ధర్మపత్ని తన పుత్రుల మృత్యు వార్తను విని గురువు పేరు కొఱకై ధర్మసం రక్షణార్థము తన పుత్రులు బలియైపోయినం దులకు సంతోషించి మిఠాయిలు పంచిపెట్టి నదట. ఓ జన్మధాత్రీ ! అంతిమ సమయంలో గూడా నా హృదయం ఏ మాత్రం చలించ కుండా ఉండాలని మీ చరణకమలములకు ప్రణమిల్లి, పరమాత్మను స్మరిస్తూ శరీరం త్యాగం చేయునట్లు వరమిమ్ము.

### ఉపసంహారము

**"యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపా స్యాని నో ఇతరాణి"**

ఇది తైత్తిరీయోపనిషత్తునందున్న సూక్తి దీని భావము :

తల్లిదండ్రులు తమ బిడ్డలకు, ఆచార్యులు తమ శిష్యులకు సదా సత్యమైన ఉపదేశ ములను యిచ్చుచుండాలి. ధర్మసంబంధమైన కర్మలను చేయుమని, దుష్టకర్మలను త్యజించ మనియు ఉపదేశించాలి. ఏది సత్యమని నమ్ముదురో, వాటిని తెలియజేసి వాటిని ప్రచారం చేయాలి. ఏ దుష్టాచారులను అభి వృద్ధి నిరోధకులను నమ్మవద్దు. తల్లి దండ్రులు ఆచార్యులు ఆజ్ఞాపించే ఉత్తమ

కర్మలనే చేయాలి. వాటినే పాటించాలి. విద్యా సంబంధంగా, ఆచరణ సంబంధముగా ఉండే ఉత్తమ శ్లోకములను, నిఘంటువులను నిరుక్తము, అష్టాధ్యాయి సూత్రములను మరియు ఇతర సూత్రములను, వేదమంత్ర ములను కంఠస్థం చేయించి, వాటికి అర్థతాత్ప ర్యములను విద్యార్థులకు బోధించుచుండాలి. "సత్యార్థప్రకాశ" మందు ప్రథమ సముల్లా సము, పరమేశ్వర నామములకు చేసి వ్యాఖ్యానమును తెలిసికొని, అలానే ఉపాసిం చాలి. ఆరోగ్య ప్రాప్తికొరకు, శరీరదృఢత్వము కొరకు తగునట్లుగా బోజనాచ్ఛానాదు లుండునట్లు వ్యవహరించాలి. విద్యార్థులకు నేర్పాలి. ఆకలి ఎంత ఉన్నదో, దానికి కొంచెం తక్కువగా భోజనం చేయాలి. మద్య మాంసాదులను సేవించరాదు. తెలియని చోట, లోతుగా జలమున్నచోట ప్రవేశించ రాదు. జలజంతువుల వలన లేక మరే వస్తువుల వలన దుఃఖం సంభవిస్తుంది. ఈత రానిచో మునిగిపోవడం గూడా సంభవించి మృత్యువాతబడతారు. "నావిజ్ఞాతే జలాశయే" ఇది మను మహర్షి హెచ్చరిక. తెలియని జలాశయాలలో ప్రవేశించి స్నానాదులు చేయరాదు.

**"మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః।
న శోభతే సభామధ్యే హంసమధ్యే బకో యథా॥**

ఇది ఒకానొక కవి సూక్తి. తమ సంతతికి విద్యా బుద్ధులు గరపని తల్లిదండ్రులు-పిల్ల లకు శత్రువులే. విద్యాగంధం లేని పిల్లలు విద్వాంసుల సభలందు-హంసలమధ్య కొంగల వలె శోభించరు. గౌరవమును పొంద జాలరు. అవమానముగా చూడబడతారు. అందువలన తమ బిడ్డలకు సర్వవిధముల విద్యలను నేర్పి, ధర్మమును బోధించి సభ్యతను అలవరిచి ఉత్తమ విద్వాంసులను చేయడం-తల్లిదండ్రుల పరమ ధర్మము బాధ్యత, యశస్కరమున్ను.

"సత్యార్థ ప్రకాశము" నుండి

విశేషము : మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు, యోగరాజైన శ్రీకృష్ణుడు, ధర్మరాజైన యుధిష్ఠిరుడు, శ్రవణ కుమారుడు, మహారాణా ప్రతాప్, వీరశివాజీ, ఆదిశంకరా చార్యులు, మహాత్మాబుద్ధుడు, మహావీరస్వామి, మహర్షి దయానంద, మహాత్మాగాంధి, అమర శహీద్ భగత్‌సింగ్, పండిత రామ ప్రసాద్ బిస్మిల్ మొదలైన క్రాంతికారులకు జన్మ ధాత్రులు నిర్మాణ కర్తలు సుశిక్షకులైన వారందరు తల్లులేగదా ?

కాని-నేడు ఆర్యావర్త పుణ్యభూమి మీద జన్మించిన తల్లులు తమను తామే పాశ్చాత్య సభ్యతలో ముంచుకుంటున్నారనితెలుపుటకు ఎంతో దుఃఖం కలుగుతుంది. గుడ్డిగా అనుకరిస్తున్నారు. కుక్కలను, పిల్లులను ఎక్కువగా ప్రేమిస్తూ, స్వసంతానాన్ని నిర్లక్ష్యం చేస్తూ, ఆయాల (సేవకురాండ్ర) చేతులలో ఆడుకొనునట్లు చేయడం మొదలైన దుర్గుణములు తల్లులలో చోటు చేసికొంటు న్నాయి.

ఏ దేశంలో స్త్రీ జాతి పతనమైనదో ఆ రాష్ట్రమున్ను పతనంవైపే పోతుంది. ఏ దేశంలో స్త్రీ జాతి ఉన్నతంగా, ఉత్తమంగా ఉంటుందో, ఆదేశం అభివృద్ధి చెందుతుంది. అందువలన, తల్లులందరు మీ గౌరవమును మరియు సంస్కృతి మహత్వమును గుర్తించి యథార్థమైన గౌరవమును సంపాదించండి.

*వివిధ సూక్తులు :*

**1) మాతా నిర్మాతా భవతి**

బిడ్డలను చక్కగా నిర్మాణం చేయడం వలననే ఆమెకు మాతృశబ్దం అన్వయిస్తుంది.

**2) నాస్తి మాతృసమో గురుః**

తల్లితో సమానమైన గురువులేడు.

**3) జననీ జన్మభూమిశ్చ స్వరాగదపి గరీయసీ**

జనని-జన్మభూమి స్వర్గమ కంటె గొప్ప.

**4) మాతా గురుతరా భూమేః**

తల్లి పృథ్వికంటే బరువైనది గౌరవనీయ మైనది.

**5) మాతృవత్పరదారేషు**

పరస్త్రీని తల్లివలె తలంచాలి.

**6) సహ్రంతు పితౄన్ పుత్రోఽ హం పృథివ్యాః**

వేయి తండ్రులకంటే గౌరవంలో తల్లియే అధికురాలు.

**7) మాతా భూమిః పుత్రోఽ హం పృథివ్యాః**

భూమి నాకు తల్లి నేను ఆమె పుత్రుడను.

**8) మాత్రా భవతు సంమనాః**

తల్లి మనస్సును స్తోష పెట్టువాడు పుత్రుడు

**9) గురూణాం మాతా గరీయసీ**

గురుజనులలో ఉన్నతస్థానంతల్లిదే.

## సుభాషితాలు

**1) అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః।
చత్వారి తస్య వర్ధన్తే ఆయుర్విద్యాయశోబలమ్॥**

భావం : ఎవరైతే నమస్కరించే స్వభావం కలవారై పెద్దలనుగౌరవిస్తారో వారికి ఆయువు, విద్యా, యశస్సు, బలము ఈ నాలుగు వృద్ధి చెందుతాయి.

**2) ప్రియవాక్య ప్రదానేన సర్వే తుష్యంతి జంతవః। తస్మాత్ తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా॥**

భావం : మంచిగా మాట్లాడటం వల్ల అందరికి ఆనందంగా ఉంటుంది. అందుకనే మంచిగానే మాట్లాడాలి. మంచిగా మాట్లాడటంలో దారిద్ర్యమేముంది ?

**3) కాకచేష్టా బకోధ్యానం శ్వాననిద్రా తథైవ చ। అల్పాహారీ మితభాషి చ విద్యార్థీ పంచలక్షణమ్॥**

భావం : కాకిలాంటి చలాకీతనము, కొంగ లాంటి ధ్యానము, కుక్కలాంటి (తక్కువ) నిద్ర, తక్కువ తినటము, తక్కువ మాట్లాడటము ఈ 5 విద్యార్థుల లక్షణాలు.

**4) ఉదితే సూర్య రక్త రక్తశ్చాస్తమయే తథా। సంపత్తౌ చ విపత్తౌ చ మహతామేకరూపతా॥**

భావం : సూర్యుడు ఉదయించేటప్పుడు మరియు అస్తమించేటప్పుడు ఒకేరకమైన ఎరుపురంగులో ఉంటాడు. అలాగే మహాను భావులు కూడా సంపదలొచ్చినా ఆపద లొచ్చినా ఒకే రకంగా ఉంటారు.

**5) శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిభిః। పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్॥**

భావం : కోటి గ్రంథాల్లో చెప్పిన విషయాన్ని నేను సగం శ్లోకంలోనే చెప్పేస్తాను. ఇతరులకు సహాయం చేయటమే పుణ్యము ఇతరులను పీడించటమే పాపము.

**6) సుఖార్థినః కుతో విద్యా నాస్తి విద్యార్థినః సుఖమ్। సుఖార్థీ నా త్యజేత్ విద్యాం విద్యార్థీవా త్యజేత్ సుఖమ్॥**

భావం : సుఖాన్ని కోరుకునే వారికి విద్య ఎలా వస్తుంది ? అలాగే విద్యార్థులకు సుఖము ఉండదు. కావున సుఖాన్ని కోరుకునే వారు విద్యను వదులుకోవాలి, అలాగే విద్యను కోరుకునేవారు సుఖాన్ని వదులుకోవాలి.

**7) నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే। అనాస్తికః శ్రద్ధధాన ఏతత్ పండితలక్షణమ్॥**

భావం : మంచిపనులను ఆచరించటం, చెడుపనులను ఆచరించకపోవటం, దేవుడిని నమ్ముట మరియు చేసేపనిపట్ల శ్రద్ధ కలిగి ఉండటం ఇవి పండితుల లక్షణాలు.

# MEDITATION ON OM

*Swara is the Atman as seen or grasped by mind. His highest name is OM, so repeat it, meditate on it and think of all its wonderful hature and attributes. Repeating the OM continuously is the only true worship. It is not a word, it is God himself. Why should there be repetion ? It is the greatest stimulus that can be given to the spirtual Samskars. So this repetition of OM and thinking of its meaning is keeping good company in your own mind.*

*-Swami Vivekananda*

# ఓమ్‌ను ధ్యానించడం

-చలవాది సోమయ్య

ఈశ్వరుడు అనగా పరమాత్మ. అతడు మనస్సుచే చూడబడుచున్నాడు లేక గ్రహించ బడుచున్నాడు. అతని అత్యున్నత నామం ఓమ్. కనుక మాటిమాటికి ఆ నామాన్ని స్మరిస్తూ దానిని ధ్యానిస్తూ ఉండాలి మరియు దాని అద్భుత స్వభావాన్ని గుణగణాలను ఆలోచిస్తూ ఉండాలి. నిరంతరం ఓమ్‌ను పలుమార్లు స్మరిస్తూ ఉండడమే అసలు నిజమైన పూజ. అది ఒక పదం కాదు. అది కేవలం భగవంతుడే. అందుకని పలుమార్లు దానిని స్మరిస్తూ ఉండాలి ? అలా చేయడం పారమార్థిక సంస్కారాలకు (spirtual Samskars) ఉత్తమోత్తమ ప్రేరకమౌతుంది. కనుక ఓమ్‌ను పలుమార్లు స్మరిస్తూ ఉండడం మరియు దాని అర్థాన్ని ఆలోచిస్తూ ఉండడం వల్ల నీ మనస్సులో సద్భావ పరంపర కొనసాగుతుంది. -స్వామి వివేకానంద

ఓమ్‌లో ఎంత విశేషమైన, విస్తృతమైన అర్థం యిమిడి ఉందో ఈ క్రింద యివ్వబడిన అవధాతు సూత్రము దాని అర్థాన్ని గ్రహించినపుడు మనకిదితెలుస్తుంది.

## అవధాతు సూత్రము

'అవ' రక్షణ, గతి, కాంతీ, ప్రీతి, తృప్తి,అవగమ, ప్రవేశ, శ్రవణ, స్వామ్యర్థ, యాచన, క్రియా, ఇచ్ఛా, దీప్తి, అవాప్తి, ఆలింగన, హింసా, దాన, భాగ, వృద్ధిశ్చ 'అవ' ధాతువు నుండి 'ఓం' శబ్దము నిష్పన్నము. అవకు 19 అర్థాలున్నాయి. అవి ఇవి.

1) **రక్షణ : అవతి రక్షతి సంసారం ఇతి ఓమ్.** పరమేశ్వరుడు ప్రపంచమును రక్షిస్తాడు గనుక ఆయన 'ఓం' పద వాచ్యుడే.

2) **గతి : అవతి గమయతి చాలయతి భ్రామయతి సంసారమ్ ఇతి ఓమ్** సర్వవ్యాపకుడైనందున తాను స్వయంగా కదలకుండా పరమాణువు నుండి బ్రహ్మాండము దాకా లోక లోకాంతరములను కదిలిస్తున్నాడు. త్రిప్పు తున్నాడు.

3) **కాంతి : అవతి, ఆప్యతే, కామ్యతే, శోభతే వా తద్ ఓమ్.** -ప్రకృతి నుండి అందమైన ప్రపంచమును సృష్టించి సుఖాన్నిచ్చేవాడు కనుక 'ఓమ్' కోరదగినవాడు.

4) **ప్రీతి : అవతి ప్రీణాతి స్నేహయతి వా తద్ ఓమ్** ఈశ్వరుడు అందరితో ప్రేమ భావాన్ని కలిగి ఉండి ఆనందాన్నిస్తాడు కనుక భక్తులు 'ఓమ్'తో స్నేహం చేస్తారు.

5) **తృప్తి : అవతి, తృప్తోభవతి ప్రాణినో వా తర్పయతి తద్ ఓమ్.** ఈశ్వరుడు ఎల్లప్పుడు తృప్తిగా ఉండి (తన సుఖం కొరకు ఏమీ కోరకుండా) అన్ని ప్రాణులకు అన్నిరకాల సుఖాలను ఇచ్చి తృప్తి పరుస్తాడు.

6) **అవగమ : అవతి అవగచ్ఛతి జానాతి చరాచరం జగత్ తద్ ఓమ్** ఈశ్వరుడు పరమాణవు నుండి బ్రహ్మాండము వరకు అన్ని పదార్థముల అన్ని ప్రాణుల భావాలు తెలిసి కొంటాడు.

7) **ప్రవేశ : అవతి సూక్ష్మత్వాత్ వ్యాపకత్వాచ్చ సర్వత్ర ప్రవిశతి వ్యాప్నోతి తద్ ఓమ్.** ఈశ్వరుడు సూక్ష్ముడు, సర్వవ్యాపకుడైనందున అతడు అంతటా ప్రవేశించి ఉన్నాడు.

8) **శ్రవణ : అవతి శృణోతి శ్రావయతి వా తద్ ఓమ్.** ఈశ్వరుడు అత్యంత రహస్యమైన వార్తాలాపాన్ని, పిలుపును వింటాడు. ప్రాణులకు వినేశక్తిని ఇస్తాడు.

9) **స్వామ్యర్థ : అవతి ఆధిపత్యం కరోతి తద్ ఓమ్.** ఈశ్వరుడు సృష్టిని శాసించి ఆధిపత్యం కలిగి ఉన్నాడు కనుక ఓమ్ సృష్టికి స్వామి.

10) **యాచన : అవతియాచందే భక్తా యామ్ తద్ ఓమ్.** సకల ఐశ్వర్యములకు స్వామి దాత కనుక భక్తులు అతని నుండి అభీష్టమైన వస్తువును కోరుకుంటారు.

11) **క్రియా : అవతి నిష్కామ కర్మ కరోతీతి ఓమ్.** ఈశ్వరుడు నిష్కామ భావంతోజగత్తును రచించి కర్మఫలములనిస్తాడు.

12) **ఇచ్ఛా : అవతి ఇచ్ఛతి ప్రాణినాం కల్యాణం ఇతి ఓమ్.** ఈశ్వరునికి ఏ విధమైన కోరికలు లేకున్నా అన్ని ప్రాణుల హితం కొరకు పనులు చేస్తాడు.

13) **దీప్తి : అవతి దీప్యతే జ్ఞాన స్వరూపత్వాద్ దీపయతి వా ప్రకాశయుక్తాన్ సూర్యాదీనితి ఓమ్.** ఈశ్వరుడు జ్ఞానస్వరూపి కనుక తేజస్వియై ప్రకాశయుక్తమైన సూర్యచంద్రులను, నక్షత్రాదులను ప్రకాశింపజేస్తున్నాడు.

14) **అవాప్తి : అవతి అవాప్నోతి వ్యాపకత్వమ్ ప్రాప్నోతి ప్రాప్యతే ఇతి ఓమ్.** పరమాత్మ సర్వ వ్యాపకుడైనందున అందరికీ అందుబాటులో ఉంటాడు.

15) **ఆలింగన : అవతి ఆలింగయతి చిత్రీకరోతి జగద్ ఇతి ఓమ్.** పరమాత్మ చిత్ర విచిత్రమైన ప్రపంచపు పదార్థములను నిర్మిస్తాడు.

16) **హింసా : అవతి హినస్తి దుష్టాన్ అన్యాయకారిణో జనాన్ ఇతి ఓమ్.**

ఈశ్వరుడు దుష్టులను అన్యాయకారులను పీడిస్తాడు.

**17) దాన : అవతి దదాతి వివిధాన్ పదార్థాన్ ఇతి ఓమ్.** జీవులందరికీ దేహము, ఇంద్రియాలు, బుద్ధి, వివిధ సుఖకారకము లైన పదార్థములను ఇస్తాడు.

**18) భాగ : అవతి విభజతి పదార్థాన్ ఇతి ఓమ్.** పరమాత్మ విభిన్న పరమాణువులను కలిపి విడదీసి సృష్టి ప్రళయాలు చేస్తాడు. ధాన్య ఫల శాకాలను పరిపక్వం చేస్తాడు.

**19) వృద్ధి : అవతి వర్ధయతి జంతు వృక్షాదీన్ ఇతి ఓమ్.** పరమాత్మ పరమాణువుల సంయోగంతో సకల వృక్ష, జంతువులను పంచభూతాలను వృద్ధి చేస్తాడు.

ఓం ఖం బ్రహ్మ -యజు 40-17

ఓం వాచక పరమాత్మ ఆకాశంవలె సర్వ వ్యాపకుడు.

ఓం క్రతో స్మర -యజు. 40-15

ఓ కర్మిష్టి జీవా ఓం ను స్మరించు.

**తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియాః । ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥** -గీత 17-24

కావున వైదికులు ఓం శబ్దాన్ని పలికి శాస్త్రోక్తాలైన యజ్ఞ దాన తపఃకర్మలను చేస్తుంటారు.

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్। యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్ ॥** -గీత 8-13

ఏకాక్షరమైన ఓం ను పలుకుతూ పరమాత్మను స్మరిస్తూ దేహాన్ని విడిచి పయనించేవాడు పరమగతిని (మోక్షాన్ని) పొందుతాడు.

ఓంకార శబ్దము పరమాత్మ సర్వోత్తమ నామం. ఎందుకంటె ఇందలి అ, ఉ, మ్ అనే మూడక్షరాలు కలిసి 'ఓమ్' పదమైనది. ఈ పేరువల్ల పరమాత్మ అనేక నామాలు గ్రహింపబడుచున్నవి. ఎట్లన- 'అ కారం' వల్ల విరాట్, అగ్ని, విశ్వుడు మొదలగు వాటికి 'ఉ కారం' వల్ల హిరణ్యగర్భుడు, వాయువు, తైజసుడు మొదలగువాటికి 'మ కారం' వల్ల ఈశ్వరుడు, ఆదిత్యుడు, ప్రాజ్ఞుడు మొదలగు వాటికి ఓం నామం వాచకం గ్రాహకం అవుతోంది. దానికి ఇలాగే వేదాది శాస్త్రాల్లో స్పష్ట వ్యాఖ్యానం ఉంది. కనుక ప్రకరణాను కూలంగా ఈ పేర్లన్నీ పరమాత్మవే. ఇవిగాక పరమాత్మకు అసంఖ్యాక నామాలున్నాయి. ఎందుకంటే పరమాత్మ గుణ, కర్మ, స్వభావాలు అనంతాలైనట్లే అతని నామాలు అనంతాలు. వాటిలో ఒక్కొక్క గుణ కర్మ స్వభావానికి ఒక్కొక్క పేరుంది. దీనిని బట్టి నేను వ్రాసిన పేర్లు కడలి (సముద్రం)లో నీటి చుక్క వలెనని ఎంచాలి. ఎందుకంటే వేదాది శాస్త్రాల్లో పరమాత్మ గుణ కర్మ స్వభావాలు అగణితంగా వ్యాఖ్యాతాలై ఉన్నాయి. ఆ వేద శాస్త్రాలను చదవడం, చదివించడం వల్ల బోధపడ తాయవి. వేదాది శాస్త్రాలను చదివే వారికి అన్యపదార్థాల జ్ఞానం పూర్ణంగా కలుగుతుంది

**అ + ఉ + మ్ = ఓ3మ్ - రక్షకుడు**

అకారంలోని 3 భగవన్నామములు విరాట్, అగ్ని, విశ్వుడు.

**విరాట్** : అతడు బహుప్రకారమగు జగత్తును ప్రకాశింపజేయువాడు గనుక 'విరాట్'.

**అగ్ని** : అతడు జ్ఞాన స్వరూపుడు, సర్వజ్ఞుడు, తెలియుటకు పూజింపబడుటకు యోగ్యుడు గనుక 'అగ్ని'.

**ఉకారములోని 3 భగవన్నామములు హిరణ్యగర్భుడు వాయువు తైజసుడు.**

**హిణ్యగర్భుడు** : అతని యందు సూర్యాది తేజోమయ లోకములు ఉత్పన్నములై అతని ఆధారమందుండును. అతడు సూర్యాది తేజస్వరూప పదార్థముల గర్భము-అనగా ఉత్పత్తిస్థానము, నివాసస్థానము గనుక అతడు హిరణ్యగర్భుడు.

**వాయువు** : అతడు చరాచర జగత్తును ధరించి జీవింపజేసి, లయింప జేయువాడను బలవంతుల కంటే బలవంతుడునగుటచే వాయువు.

**తైజసుడు** : తాను స్వయం ప్రకాశకుడై సూర్యాది తేజోమయ పదార్థములను ప్రకాశపరచువాడు గనుక తైజసుడు.

**'మ' కారములోని 3 భగవన్నామ ములు-ఈశ్వరుడు, ఆదిత్యుడు, ప్రాజ్ఞుడు.**

**ఈశ్వరుడు** : అతనికి సత్య విచారశీల జ్ఞానం, అనంత ఐశ్వర్యం కలదు గనుక ఈశ్వరుడు.

**ఆదిత్యుడు** : అతడెన్నడు నశించని వాడు గనుక 'ఆదిత్యుడు'.

**ప్రాజ్ఞుడు** : అతడు భ్రాంతి రహితుడు, జ్ఞానయుక్తుడు సమస్త చరాచరలోక వ్యవహార ములను ఉన్నదున్నట్లు తెలియువాడు గనుక ప్రాజ్ఞుడు.

| అ | ఉ | మ్ |
|---|---|---|
| జాగ్రత్ | స్వప్నః | సుషుప్తిః |
| సృష్టిః | స్థితిః | ప్రళయః |
| ప్రాణః | అపానః | వ్యానః |
| పృథివీ | అంతరిక్షం | ద్యౌః |
| అస్తి | భాతి | ప్రీతిః |
| సత్ | చిత్ | ఆనందః |
| శుద్ధః | బుద్ధః | ముక్తః |
| భూః | భువః | స్వః |
| భువనం | భూతం | భవితా |
| ఈశ్వరః | జీవః | ప్రకృతిః |
| ఋక్ | యజుః | సామ |
| బ్రహ్మ | విష్ణుః | రుద్రః |
| పితా | పుత్రః | మాతా |

పైన వివరించిన విషయం ఆధారంగా ఓం కారంలో ఎంతటి విస్తృతమైన అర్థం యిమిడి ఉన్నదో మనకు అవగతమౌ తున్నది. కనుక పరమేశ్వరుని ఈ సర్వోన్నత నామాన్ని నిరంతరం స్మరిస్తూ అందలి అర్థాన్ని మననం చేస్తూ ఉండడం వల్ల మనస్సు పవిత్రమై త్వరలోనే పరమేశ్వర సాక్షాత్కారం మనకు లభించి ముక్తిని కూడ పొందగలమని ఆశిస్తున్నాము.



**గోపాల్ గులేకర్ గారి ప్రథమ వర్థంతి**

మరణం : 18-03-2018

**కీ॥ శే॥ గోపాల్ గులేకర్** గారు కార్వాన్ ఆర్య సమాజ సభ్యులు, నిస్వార్థపరులు, సమాజ సేవకులు, ఆర్య సమాజానికి విశేష సేవలు అందించినారు. ఈయన ప్రథమ వర్ధంతి సందర్భమున కుటుంబ సభ్యుల తరపున మరియు ఆర్య సమాజము కార్వాన్ తరపున భావపూర్ణ శ్రద్ధాంజలి.

# ఉగాది నూతన సంవత్సర మరియు ఆర్య సమాజ స్థాపనా దినోత్సవ ఆహ్వానము

స్వస్తిశ్రీ వికారి నామ సంవత్సర చైత్ర శుక్ల ప్రతిపద శనివారము తేది 06-04-2019 రోజున ఆర్యప్రతినిధి సభ ఆ.ప్ర. -తెలంగాణ వారి ఆధ్వర్యములో ఉగాది నూతన సంవత్సర పర్వదినము మరియు ఆర్య సమాజ స్థాపనా దినోత్సవము సుల్తాన్‌బజార్‌లో గల సభాభవనము నందు ఉదయము 10-00 గంటల నుండి 12-00 గంటల వరకు కార్యక్రమము జరుపబడును. ఈ కార్యక్రమములో దేవయజ్ఞముతో పాటు భజనలు మరియు విద్వాంసుల చేత ప్రవచనములు ఇవ్వబడును. కావున సమస్త నగరద్వయ ఆర్య సమాజ కార్యకర్తలు, ఆర్యబంధువులు మరియు నగరవాసులు అధికసంఖ్యలో పాల్గొని కార్యక్రమమును సఫలముచేయగలరని మనవి.

ఆహ్వానించువారు :

అధ్యక్షులు :
**డా॥ లక్ష్మణ్ సింగ్**

కార్యదర్శి :
**ప్రొ॥ విఠల్ రావు ఆర్య**

**ఆర్యప్రతినిధి సభ ఆ.ప్ర. -తెలంగాణ**

## మూడవ యోగసాధన శివిరము

స్వస్తిశ్రీ వికారి నామ సంవత్సర చైత్ర కృష్ణ తృతీయ సోమవారము నుండి ఆదివారము వరకు తేది 22-04-2019 నుండి 28-04-2019 వరకు ఏడు దినములు

ఈ శివిరంలో పాల్గొను సాధకుల సంఖ్య పరిమితము వారికి ఎనిమిది దినములు భోజనము, ఆవాస వసతులు కల్పించబడును. కావున 18 సంవత్సరాలు పైబడిన స్త్రీ పురుషులు వెంటనే 650/- రూపాయలు చెల్లించి స్వీకృతి పొందగలరు. స్వీకృతి పొందిన సాధకులు ఆదివారము అనగా 21-4-2019 నాడు సాయంత్రము 4-00 గంటల వరకు శివిర స్థలమునకు చేరుకోవలెను.

శివిర స్థలము : **యస్.పి.ఆర్. స్కూల్,** గ్రా॥ లింగాపూర్, కామారెడ్డి.

సూచన : బస్టాండ్ నుండి 4 కి॥ మీ॥ నిజాంసాగర్ మార్గములో కలదు.

నిర్వాహకులు : **వేద ధర్మ ప్రచార సమితి,** కామారెడ్డి

గౌరవ అధ్యక్షులు :
**యం. ధర్మవీర్ గారు**
9000056018

అధ్యక్షులు :
**కంకణాల కిషన్, కామారెడ్డి**
9440033446, 9000733446

కోశాధికారి :
**కొమిరిశెట్టి శంకరయ్య**
9392344855

Date of Publication 2nd and 17th of every Month, Date of Posting 3rd and 18th of every Month
आर्य जीवन 03-04-2019 Registered-Reg. No. HD/783/2018-20 RNI No. 52990/93

# ఆర్య జీవన్

హిందీ - తెలుగు ద్విభాషా పక్ష పత్రిక

Editor : **Vithal Rao Arya**, M.Sc. LL.B., Sahityaratna
Arya Prathinidhi Sabha AP-Telangana, Sultan Bazar, Hyderabad-500095.
Phone No. : 040-24753827, 66758707, Fax : 040-24557946
Annual Subscription Rs. 250/- సంపాదకులు : **విఠల్ రావు,** మంత్రి సభ

To,
**Swami Swarupanand ji Saraswath**
Arya Samaj Mandir,
Hanuman Road,
New Delhi-1100

## వైదిక ప్రశిక్షణ శివిరము

**నేటి బాలలే రేపటి పౌరులు. నేటి శిక్షణ మన భవితకు రక్షణ.** సమగ్ర వ్యక్తిత్వ వికాసము కొరకు వైదిక ప్రశిక్షణ శివిరము 14 రోజుల పాటు ఆర్యప్రతినిధి సభ ఆ.ప్ర. -తెలంగాణ వారి ఆధ్వర్యములో వివిధ సమాజాలు మరియు విద్యాలయాలలో నిర్వహింపబడును. ఇందులో పిల్లలకు వ్యక్తిత్వ వికాసము, సమయపాలన, క్రమశిక్షణ, వేదమంత్రములు, నీతిశ్లోకాలు, భక్తి-భజనలు, యోగాసనములు మొదలగునవి నేర్పించబడును. కావున తమ తమ పిల్లలను అధిక సంఖ్యలో శివిరముకు పంపగలరు.

స్వస్తిశ్రీ వికారి నామ సంవత్సర చైత్ర కృష్ణ తృతీయ సోమవారము నుండి ఆదివారము వరకు
తేది **22-04-2019** నుండి **05-05-2019** వరకు 14 రోజులు.
అర్హత : **6వ తరగతి నుండి 10వ తరగతి విద్యార్థులకు.**
సమయం : **ఉదయం 9-00 గం॥ల నుండి 11-00 గం॥ల వరకు.**

### సికింద్రాబాద్, హైదరాబాద్ జంటనగరాలలో శివిరములు నిర్వహింపబడు స్థలములు

1) ఆర్య సమాజము లాలాగూడ, 2) ఆర్య సమాజము కిషన్‌గంజ్, 3) ఆర్య సమాజము కుర్మగూడ, 4) ఆర్య సమాజము ఉమ్దాబజార్, 5) ఆర్య సమాజము పాట్ మార్కెట్, సికింద్రాబాద్, 6) లిటిల్ బర్డ్ హై స్కూల్, ఓల్డ్ సఫిల్‌గూడ, సికింద్రాబాద్, 7) వినాయక్ నగర్, ఓల్డ్ సఫిల్‌గూడ, సికింద్రాబాద్, 8) ఆనంద్‌బాగ్, మల్కాజ్‌గిరి, సికింద్రాబాద్, 9) రామంతాపూర్, 10) శివాలయము, ఉప్పల్, 11) ఉప్పల్, 12) మల్కాజ్‌గిరి, 13) చైతన్యపురి కమ్యూనిటి హాల్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్.

*ఇంకెవరైన శివిరములు నిర్వహించదలచిన వారు శివిర ప్రబంధకులను సంప్రదించగలరు.*

శివిరముల ప్రబంధకులు మరియు సంచాలకులు :

**హరికిషన్ వేదాలంకార్**
9703066001

**కె. విజయేంద్ర**
9247131100

**డా॥ విశ్వశ్రవాచార్య**
8099333754

## బాలబాలికల సదాచార ప్రశిక్షణ శివిరము

వ్యక్తి నిర్మాణమే రాష్ట్ర నిర్మాణము, దేశం గర్వించ దగ్గ వ్యక్తుల నిర్మాణమే
**ఆర్య సమాజము ఇందూరు** యొక్క ఉద్దేశ్యం.
ఈ వేసవి శివిరములో విద్యార్థులను దేశభక్తులుగా ఆరోగ్యవంతులుగా తీర్చిదిద్దుటకు
వివిధ అంశాలపై అవగాహన కల్పించడం జరుగుతుంది.

**శుక్రవారము తేది 19 ఏప్రిల్ 2019 నుండి ఆదివారము 28 ఏప్రిల్ 2019 వరకు 10 దినములు.**

అర్హత 8వ తరగతి నుండి 12 తరగతి విద్యార్థులకు. ఆవాసము అబ్బాయిలకు మాత్రమే,
అమ్మాయిలు ఉ॥ 6.00 గం॥ల నుండి రాత్రి గం॥ 7-30 ని॥ల భోజన సమయం వరకు.
భోజన శుల్కం రూ॥ 1000/- మాత్రమే. **స్థలము : ఆర్య సమాజము ఇందూరు (నిజామాబాద్)**
ప్రధానాచార్యులుగా వైదిక విద్వాంసులైన
**శ్రీ అరుణ్ కుమార్ ఆర్యవీర్** గారు భాగ్యనగరం నుండి విచ్చేయనున్నారు.
సంప్రదించుటకు : **ఆచార్య వేదమిత్ర-9848853383.**


*Editor :* Vithal Rao Arya ● Email : acharyavithal@gmail.com, Mobile : 09849560691
సంపాదకులు : శ్రీ విఠల్‌రావు మంత్రి సభ, ఆర్యప్రతినిధి సభ ఆ.ప్ర.-తెలంగాణ, సుల్తాన్‌బజార్, హైదరాబాద్-95. Ph : 040-24753827, Email : acharyavithal@gmail.com
संपादक : श्री विठ्ठलराव मंत्री सभा ने सभा की ओर से आकृति प्रिन्टर्स में मुद्रित करवा कर प्रकाशित किया ।
प्रकाशकः आर्य प्रतिनिधि सभा आं.प्र.-तेलंगाना, सुल्तान बाज़ार, हैदराबाद तेलंगाना-[illegible]